శ్రీమత్పరదేవతాయైనమః

# శివానందలహరి

[ శ్రీ మచ్ఛంకర భగవత్పాద విరచితము ]



ఆంధ్రానువాదము

ముకుంద రామమూర్తి



 1959 మూల్యం రు 0=75

# శివానందలహరి



ప్రతులకు:
ముకుంద శ్రీరామచంద్రమూర్తి
శివానందలహరి పబ్లిషర్సు
మామిళ్ళగూడెం. ఖమ్మంమెట్టు.
(Khammameth, Central Rly.)

శ్రీశివాయగురవే నమః

# శివానందలహరి



౧

శ్లో॥ కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతు మే
శివాభ్యా మస్తోకత్రిభువన శివాభ్యాం హృది పున
ర్భవాభ్యా మానందస్ఫుర దనుభవాభ్యాం నతిరియమ్.

౨

శ్లో॥ గళంతీ శంభో త్వచ్చరిత సరితః కిల్బిష రజో
దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్
దిశంతీ సంసారభ్రమణ పరితాపోపశమనం
వసంతీ మచ్చేతోహ్రదభువి శివానందలహరీ.

౩

శ్లో॥ త్రయీ వేద్యం హృద్యం త్రిపురహరమాద్యం త్రిణయనం
జటాభారోదారం చలదురగహారం మృగధరం
మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం
చిదాలంబం సాంబం శివమతి విడంబం హృదిభజే.

౪

శ్లో॥ సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
నమన్యే స్వప్నేవా తదనుసరణం తత్కృత ఫలం
హరి బ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం
చిరంయాచే శంభో శివ తవ పదాంభోజ భజనం.

శ్రీశివాయగురవే నమః

# ఆంధ్రానువాదము

౧

శా. శ్రీ కల్యాణ కలామయుల్ శశికలా శీర్షావతంసుల్, నిజా
స్తోక ప్రాప్త తపః ఫలుల్ వరదులీశుల్లోక భద్రప్రదుల్
నైకానందరసాను భావులును పౌనః పున్య భవ్యుల్ హృదిన్
మోకారించి నమస్కరింతు మిము శంభో! సత్కృపాంభోనిధే.

౨

శా. నీ కల్యాణ కథాసరిద్గళితమై నిత్యంబు పాపఘ్నమై
ధీ కుల్యం బ్రసరించి చిత్తహ్రదమున్ దేరన్ శివానందమౌ
నీ కారుణ్య స్రవంతి సంతతభవానీ కోద్ధ సంతాపమున్
బోకారించి జయంబునొందెడును శంభో! సత్కృపాంభోనిధే.

౩

మ. శ్రుతివేద్యుం త్రిపురాంతకున్, త్రిణయనున్, శూలిన్, హరున్, హృద్యునిన్,
ధృతసారంగు, జటాభరుఁ, మృడు, మహాదేవుం, జిదానందు, సం
భృతనాగాభరణున్, శివున్, బశుపతిన్, మృత్యుంజయుఁ సాంబు సం
ప్లుత కారుణ్య విడంబు, నిన్గొలుతు శంభో! సత్కృపాంభోనిధే.

౪

మ. జగతిఁ దేవతలెల్ల క్షుద్రఫలదుల్ సర్వేశ యెవ్వారలఁ
దగ నర్థింపను, స్వప్నమందయినఁ జెంతన్నిల్చి నిన్గొల్చు ప
న్నగరాట్ఛాయియుఁ బద్మసంభవుఁడు గానన్లేని నీ పాద మొ
ప్పఁగఁ గాంక్షింతు భజింపఁగా సతము శంభో! సత్కృపాంభోనిధే.

౫

శ్లో॥ స్మృతౌ శాస్త్రే వైద్యే శకున కవితా గానఫణితౌ
పురాణే మంత్రేవా స్తుతి నటన హాస్యేష్వ చతురః
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతిమయికోఽ హం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ ప్రథిత కృపయా పాలయ విభో !

౬

శ్లో॥ ఘటోవామృత్పిండోఽప్యణురపిచధూమోఽగ్నిరచలః
పటోవాతంతుర్వా పరిహరటి కింఘోరశమనం
వృథా కంఠక్షోభం వహసిత రసా తర్కవచసా
పదాంభోజం శంభోర్భజ పరమ సౌఖ్యం వ్రజసుధీ.

౭

శ్లో॥ మనస్తే పాదాబ్జే నివసతువచ స్తోత్రఫణితౌ
కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపికథాకర్ణన విధౌ
తవధ్యానే బుద్ధిర్నయన యుగళం మూర్తివిభవే
పరగ్రంథా న్కైర్వా పరమశివ జానే పరమతః.

౮

శ్లో॥ యథా బుద్ధి శ్శుక్తౌ రజతమితికాచాశ్మని మణి
ర్జలేపైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్
తథా దేవ భ్రాంత్యా భజతి భవదన్యం జడజనో
మహాదేవేశం త్వాం మనసిచ నమత్వా పశుపతే.

౫

మ. స్మృతులన్ శాస్త్రు పురాణ హాస్య నటనా వృత్తంబులన్ సన్నుతిఁ
అతులంబైన కవిత్వగానముల నే నజ్ఞుండ, నింకెట్లు భూ
పతులం జేరి కరంతునో పశుపతీ! పాలింపుమా! వేగ బ్రో
వు, తిరంబైన కృపఁ నన్నుఁ బశుని శంభో! సత్కృపాంభోనిధే.

౬

శా. వాదంబేల? ఘటంబొ మృణ్మయమొ గ్రావంబో పటంబో మఱిం
కే దేనిన్ యమదండనన్ గెడపునో! యింతేల! నీ పాదముల్
చేదోయిం గొని చతు లర్పణముగాఁ జేయ స్థిరస్త్రాఘుఁడై
మోదంబందుచు ముక్తికాంతఁ గను శంభో! సత్కృపాంభోనిధే.

౭

మ. మన మెల్లప్పుడు నీ పదాబ్జముల, సంభాషల్ నుతిన్, గేలు న
ర్చనఁ, గర్ణమ్ములు గాథలన్, నయనముల్ రాణించు సన్మూర్తినిన్
ధీనిశ్చంచల ధ్యాన మందున, సదా దీపింపకే గ్రంథముల్
పునరావృత్తిగఁ ద్రిప్పనేమిటికి! శంభో! సత్కృపాంభోనిధే.

౮

మ. ధరశుక్తమ్మును వెండి, గాచమును రత్నం, బెండమావుల్ జలం,
బరుదౌ పిష్టజలమ్ము క్షీరమునుగా నాశించి నశ్లేగదా
సురవంద్యున్ దెలియంగ నేరకయె నిన్ క్షుద్రామరుల్ గొల్చుటల్
పురసంహార విహార! ప్రోవు నను, శంభో! సత్కృపాంభోనిధే.

౯

శ్లో॥ గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేచ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ నజానాతి కిమహో !

౧౦

శ్లో॥ నరత్వం దేవత్వం నగ వన మృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాది జననమ్
సదా త్వత్పాదాబ్జ స్మరణ పరమానంద లహరీ
విహారాసక్తం చేద్ధృదయమిహ కింతేన వపుషా.

౧౧

శ్లో॥ వటుర్వా గేహీవా యతిరపి జటీవా తదితరో
నరోవా యః కశ్చిద్భవతు భవ కింతేన భవతి
యదీయం హృత్పద్మం యది భవ దధీనం పశుపతే
తదీయ స్త్వం శంభో భవసి భవభారంచ వహసి.

౧౨

శ్లో॥ గుహాయాం గేహేవా బహిరపి వనేవాఽద్రి శిఖరే
జలేవా వహ్నౌవా వసతు వసతేః కింవదఫలమ్
సదా యస్యైవాంతఃకరణమపి శంభో తవ పదే
స్థితం చేద్యోగోఽసౌసచ పరమయోగీ సచ సుఖీ.

౯

మ. నినుఁ బూజింపఁగ నిమ్నమౌ సరసునన్, నిష్ఠన్ సుమార్ధంబు ని
ర్జనమౌ ఘోరవనంబునన్, ఘనమహీధ్రం బందునన్ గ్రుమ్మరున్
గనఁగా నొల్లఁడు మూఢచిత్తుఁ డెటులన్ గౌరీశ! చిత్తాంబుజం
బును నర్పించి సుఖంబు నొంద గను శంభో! సత్కృపాంభోనిధే.

౧౦

మ. నరుఁడో దేవతయో మహాద్రివనులన్ నట్టాడు నే జంతువో
సరగన్ పక్షియొ కీటమో పసరమో జన్మంబికేమైన సు
స్థిరతన్ నీదగు పాదపంకజము భక్తిం గొల్వగా నేర్చినన్
బురుడౌ నెద్ది శరీర మేదయిన శంభో! సత్కృపాంభోనిధే.

౧౧

మ. వటుఁడైనన్ జటియైన గేస్తయిన సర్వం బూడ్చు సన్న్యాసియేన్
పటుసంసార భరంబుఁ బోదురిమి నీ ప్రాపున్ బ్రసాదింతువో
నిటలాక్షా! నినుఁ గొల్వ సంతతము త్వన్నిఘ్నంబుగాఁ జేసి హృ
త్పుటమున్ భక్తిని, పార్వతీప్రణయ! శంభో! సత్కృపాంభోనిధే.

౧౨

మ. గుహలన్ గేహములన్ బహిస్థ్సలమునన్ గోత్రాగ్ర మం దగ్నిలోన్
గహనంబందు జలంబునందు వసతిన్ గల్పింపఁగా నేమి? స
న్నిహితంబెవ్వని యాత్మ నీ పదములన్ నిత్యంబు యోగీంద్రుఁడౌ
ముహురానందము నొందు. యోగమది శంభో! సత్కృపాంభోనిధే.

౧౩

శ్లో॥ అసారే సంసారే నిజభజనదూరే జడధియా
భ్రమంతం మా మంధం పరమకృపయా పాతుముచితం
మదన్యః కోదీనస్తవ కృపణ రక్షాతి నిపుణః
తదన్యః కోవా మే త్రిజగతి శరణ్యః పశుపతే!

౧౪

శ్లో॥ ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమ బంధుః పశుపతే
ప్రముఖ్యోహం తేషామపి కిముత బంధుత్వమనయోః
త్వయైవ క్షంతవ్యాశ్శివ! మదపరాధాశ్చసకలాః
ప్రయత్నాత్కర్తవ్యం మదవనమియం బంధుసరణిః

౧౫

శ్లో॥ ఉపేక్షానోచే త్కిం నహరసి భవద్ధ్యాన విముఖాం
దురాశా భూయిష్ఠాం విధిలిపిమశక్తో యది భవాన్
శిరస్తద్వైధాత్రం న నఖలు సువృత్తం పశుపతే
కథంవా నిర్యత్నం కర నఖ ముఖే నైవ లులితమ్.

౧౬

శ్లో॥ విరించి ర్దీర్ఘాయుర్భవతు భవతా తత్పర శివ
శ్చతుష్కం సరక్ష్యం సఖలు భువిదైన్యం లిఖితవాన్
విచారః కోవా మాం విశద కృపయాపాతిశివ! తే
కటాక్ష్యవ్యాపార స్స్వయమపిచ దీనావన పరః.

౧౩

శా. పారంబేమియులేక త్వద్భజన విజ్ఞానాతి దూరస్థ సం
సారంబందు భ్రమించు నంధుని ననున్ సంరక్ష సేయం దగున్
వేరెవ్వార లనాథ రక్షణపరుల్ విశ్వేశ, దీనుండ, నన్
పూరంబౌ కృపఁ జూడవే! శరణు శంభో! సత్కృపాంభోనిధే.

౧౪

శా ఆపన్నార్తి నివారణాకిరత! నే నాప న్నిమగ్నుండనై
నీ పాదమ్ములఁ బట్టినాఁడ నిక సందేహంబు లేదాప్తుఁడన్
పాపంబుల్ నిరసించి నన్మనుట భవ్యమ్మైన బంధుత్వ త
త్త్వోపేతమ్మగు ధర్మ సంసరణి శంభో! సత్కృపాంభోనిధే.

౧౫

మ. దురితాశల్ మదినిండ నీ భజనకుఁ దూరుండఁగాఁ జేయు నా
యరవిందోద్భవు వ్రాతలన్ దుడువ కీ వట్లే యుపేక్షింతు; సం
తరసఁ ధాతృ సవృత్త శీర్షమును గోటన్ వీడఁగాఁ జీల్చి త
ద్బరమే నీ కిటు నన్ను గావఁగను శంభో! సత్కృపాంభోనిధే.

౧౬

శా. దైన్యంబున్ దలవ్రాసి మేలిడిన ధాతన్బ్రోచు దీర్ఘాయుగా
మాన్యా! వాని శిరశ్చతుష్కమును ప్రేమం గాచి, దీనావనా
గణ్యంబౌ భవదీయ సంతత కటాక్షవ్యాపృతిం జూప
మా పుణ్యంబేయగు; నేల చింతపడ! శంభో! సత్కృపాంభోనిధే.

౧౭

శ్లో॥ ఫలాద్వాపుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో
ప్రసన్నేఽపిస్వామిన్! భవ చమల పాదాబ్జ యుగళం
కథంపశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమ జుషాం
నిలింపానాం శ్రేణి ర్నిజ కనక మాణిక్యమకుటైః.

౧౮

శ్లో॥ త్వమేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం
వహం తస్త్వన్మూలాం పునరపి భజంతే హరిముఖా
కి యద్వా దాక్షిణ్యం తవశివ! మదాశాచకియతీ
కదావామద్రక్షాం వహసి కరుణాపూరితదృశా.

౧౯

శ్లో॥ దురాశా భూయిష్ఠే దురధిపగృహద్వార ఘటికే
దురంతేసంసారే దురితనిలయే దుఃఖజనకే
మదాయాసం కిం నవ్యపనయసి కస్యోపకృతయే
వదేయం ప్రీతిశ్చే త్తవ శివ కృతార్థాః ఖలు వయం.

౨౦

శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశా శాఖాస్వటతి ఝుడితిసైర మభితః
కపాలిన్భిక్షోమే హృదయ కపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బధ్వా శివ! భవదధీనం కురువిభో!

౧౭

శా. నాదౌ పుణ్య ఫలాప్తిచేతనొ భవన్నైజావనాసక్తినో
నీదౌ భక్తప్రసన్నతన్ మనుదు నంతే నెట్లు గాఁ జూఁతు నీ
పాదాబ్జంబు! నమత్సురాళిమకుట ప్రస్నిగ్ధ రత్నచ్ఛవిన్
ప్రోద్రైయుండ ననారతంబు, శివ ! శంభో ! సత్కృపాంభోనిధే.

౧౮

శా. నీవే ముక్తి నొసంగు దీ జగములం నీ కారణంబై కదా
శ్రీ వైకుంఠముఖుల్ సుదివ్యపదులై సేవింత్రు నిన్నెప్పుడున్ !
నీ వాత్సల్య మదెంతయో కద భవానీ నాథ! మద్రక్షణ
మ్మున్వే సల్పు, దురాశ నాకనక శంభో! సత్కృపాంభోనిధే.

౧౯

శా. ఈ సంసార దురాశ దుష్టులగు భూమీశాంగణా సేవచే
దోసంబయ్యె దురంత దుఃఖముల నెంతో నించె నా కష్టముల్
వీసంబైన గణింప వజ్జఁజు కృతిన్ ప్రేమేని దాసాళియుం
మోసంబుఁ గనబోము ధన్యులము, శంభో! సత్కృపాంభోనిధే.

౨౦

శా. మోహారణ్యమునం జరించు, వెగుఱుం బూ బోండ్ల చన్గొండలన్
సాహంకారతఁ జిత్తమ స్గపి దురాశా శాఖలం దూకు ను
త్సాహిం, భిక్షు! కపాలి! భక్తిసూత్రంబందు బంధించి దు
ర్వ్యూహమ్ముల్ చొరనీక చేకొనుము శంభో! సత్కృపాంభోనిధే.

౨౧

శ్లో॥ ధృతిస్తంభాధారాం దృఢగుణ నిబద్ధాం సగమనాం
విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివస సన్మార్గఘటితామ్
స్మరారే మచ్చేతస్స్ఫుటపటకుటీం ప్రాప్యవిశదాం
జయస్వామిన్ శక్త్యా సహశివగణై స్సేవిత విభో.

౨౨

శ్లో॥ ప్రలోభాద్యైరర్థా హరణ పరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్భ్రమతి బహుధా తస్కరపతే
ఇమంచేతశ్చోరం కథ మిహ సహే శంకర విభో
తవాధీనం కృత్వామయి నిరపరాధే కురు కృపామ్.

౨౩

శ్లో॥ కరోమి త్వత్పూజాం సపది సుఖదోమే భవవిభో
విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫలమితి
పునశ్చత్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షి మృగతా
మదృష్ట్వా తత్ఖేదం కథమిహ సహే శంకర విభో !

౨౪

శ్లో॥ కదావా కైలాసే కనకమణి సౌధే సహగణై
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటిత మూర్ధాంజలి పుటః
విభో సాంబస్వామిన్ పరమశివ పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామిసుఖతః.

౨౧

మ. విను ధైర్యంబను కంబమూతఁగ గఁడుం బెంపొగుణావృత్తమై
కన పద్మాకృతిఁ జిత్రమై సగమనా కర్షంబు సన్మార్గ స
మ్మనితంబౌ మన మన్గుడారమున నంబా ప్రీతి త్వచ్ఛ్రేణి సొం
పునఁ జేరం జయమౌను, సాంబశివ! శంభో! సత్కృపాంభోనిధే.

౨౨

మ. ఘనలోభంబునఁ జిత్తచోరుఁడు ధనాకర్షం బ్రయత్నించుచుఁ
ధనిగేహంబులఁ జేరఁజూచు నతనిన్ దధ్యంబు నే నొల్లఁ జే
తును వే నీకు నధీనుఁ దస్కరపతీ! దుష్టాత్ము బంధించి కా
వుననున్ నిర్గత దోషుగా నెరపి శంభో! సత్కృపాంభోనిధే.

౨౩

మ. నినుఁ బూజించెద నిత్య సత్య ఫలమున్ నే గోరెదన్ మానసం
బున, నీ విచ్చెదొ బ్రహ్మ విష్ణు పదముల్! భూతేశ! నిగ్రమ్మటఁ
గనఁగాఁ బక్షిమృగత్వ రూపముల నాకాశంబునన్ భూమిలోఁ
బునరావృత్తిని పైతు ఖేదమెటు! శంభో! సత్కృపాంభోనిధే.

౨౪

మ. లలి కైలాస సువర్ణరత్నమయవేలాకుడ్య సౌధమ్ములో
పల సద్భక్త గణాళి గొల్వ నెదుటం భద్రమ్ముగా నిల్చి కేల్
తలపై దాల్చి శివా! పరాత్పర! యనంతా! పాహి! యంచీ యుగం
బుల నొప్పం దృటివోలె నెట్టుదునొ! శంభో! సత్కృపాంభోనిధే.

౨౫

శ్లో॥ స్తవైర్బ్రహ్మాదీనాం జయజయ వచోభిర్నియమినాం
గణానాం కేళీభిర్మద కల మహోక్షస్య కకుది
స్థితం నీలగ్రీవం త్రిణయన ముమాశ్లిష్ట వపుషం
కదాత్వాం పశ్యేయం కరధృత మృగం ఖండ పరశుమ్.

౨౬

శ్లో॥ కదావా త్వాం దృష్ట్వా గిరిశ తవ భవ్యాంఘ్రి యుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్
సమాశ్లిష్యాఘ్రాయస్ఫుట జలజగంధాన్ పరిమళా
నలభ్యాం బ్రహ్మాద్యైర్ముద మనుభవిష్యామి హృదయే.

౨౭

శ్లో॥ కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజాఽమరసురభి చింతామణి గణే
శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే
కమర్థం దాస్యేఽహం భవతు భవ దర్థం మమ మనః.

౨౮

శ్లో॥ సారూప్యం తవపూజనే శివ। మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తి ధుర్యజనతా సాంగత్య సంభాషణే
సాలోక్యంచ చరాచరాత్మక తనుధ్యానే భవానీ పతే
సాయుజ్యం మమసిద్ధమత్ర భవతి స్వామిన్ కృతార్థోఽ
స్మ్యహం.

౨౫

మ. స్తుతులన్ బ్రహ్మ ముఖామరుల్ జయవచశ్శ్రుత్యుక్తులన్ మౌనులున్
నతి నృత్యత్ప్రమథాళియుం గొలువ నున్మత్తోక్ష స్కంధంబుపై
సతితోనున్న మృగాంకు ఖండపరశున్ శర్వున్ త్రినేత్రున్ మహా
ద్భుత తేజున్ నిను గాంచ నెన్నడగు। శంభో। సత్కృపాంభోనిధే

౨౬

మ. భవ దంఘ్రిద్వయి గాంచి కేలఁగొని నే భవ్యంబుగా మౌళి నిన్
దవులన్, గన్నులనద్ది గ్రుచ్చి యెడదన్ దాల్పన్ బిగిన్ గౌఁగిటన్
దివి బ్రహ్మాదులకుఁ నలభ్యమగు తద్దివ్యాబ్జ సౌరభ్యముఁ
భువి నాఘ్రాణ సుఖంబు నొందెదను శంభో। సత్కృపాంభోనిధే.

౨౭

మ. అరచేతం గనకాద్రి ప్రక్క నలద్రవ్యాధీశుఁ డింటఁ దివ
స్తరు చింతామణి కామధేను తతి మూర్ధంబందు శీతాంశుఁడుఁ
వరపాదంబున నెల్లశోభనములుఁ వర్తిల్ల నింకేమి య
ప్పురవుఁ వస్తుల నిత్తు। నిత్తుమది శంభో। సత్కృపాంభోనిధే.

౨౮

మ. సారూప్యమ్మగు నీదు పూజసలుపన్ సామీప్యమౌ నిన్మదిఁ
సారమ్మౌనటు సంస్తుతింపఁగ మహా సాలోక్యమౌ భక్తి ని
చ్చారాహిత్యుల స్నేహభాషణములఁ సాయుజ్యమౌగా దయాం
భోరాశి న్నిను నెమ్మది న్నిలుప శంభో। సత్కృపాంభోనిధే.

౨౯

శ్లో॥ త్వ త్పాదాంబుజ మర్చయామి పరమం త్వాం చింతయా
మ్యన్వహం
త్వామీశం శరణం వ్రజామి వచసా త్వామేవయాచే విభో
వీక్షాంమే దిశచాక్షుషిం సకరుణాం దివ్యైశ్చిరం పార్థితాం
శంభో! లోకగురో! మదీయ మనస స్సౌఖ్యోపదేశం కురు.

౩౦

శ్లో॥ వస్త్రోద్ధూత విధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా
గంధే గంధవహాత్మతా న్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా
పాత్రే కాంచనగర్భతా స్తిమయిచే ద్బాలేందుచూడామణే
శుశ్రూషాం కరవాణి తే పశుపతే స్వామిన్ త్రిలోకే గురో.

౩౧

శ్లో॥ నాలంవా పరమోపకారక మిదం త్వేకం పశూనాం పతే
పశ్యన్ కుక్షిగతాన్ చరాచర గణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్
సర్వామర్త్యపలాయ నౌషధమతి జ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళేన గిళితం నోద్గీర్ణమేవత్వయా.

౩౨

శ్లో॥ జ్వాలోగ్ర స్సకలామరాతి భయదః క్ష్వేళః కదంవా త్వయా
దృష్టః కించ కరేధృతః కరతలే కిం పక్వ జంబూఫలం!
జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కంఠదేశే భృతః
కింతే నీలమణి ద్విభూషణ మయం శంభో! మహాత్మన్ వద.

౨౯

మ. భువి నీపాదములన్ భజింతు మననంబుం జేతు నీ నామమున్
భవ! నిన్నే శరణంబు వేడెదను నిన్ ప్రార్థింతు మద్వాక్కునన్
దివిజుల్ గోరెడు నీదు సత్కరుణ దృష్టిం జూచి మన్నింపు నన్
భువనాధీశ! సుఖోపదేశకర! శంభో! సత్కృపాంభోనిధే.

౩౦

మ. వసనోద్ధూతి సహస్ర హస్తతయు బుష్పప్రాప్తి సద్విష్ణుతన్
వసుమద్గర్భత పాత్ర సాదనమునన్ భక్తి న్సుగంధార్చనన్
రసవద్గంధ వహత్వమన్నపచనార్చన్ బాక శాసత్వమున్
బొసగన్ నీ పదసేవ జేసెదను శంభో! సత్కృపాంభోనిధే.

౩౧

మ. ఓ దేవా! పరమోపకారమిది కాదో! భీతిదేవాసురుల్
భేదమ్ముల్ పడిపార క్ష్వేళమును బల్మిన్ బట్టి కంఠంబునన్
బాదై నిల్పితి; పైకి లోకి విడకే బాహ్య ప్రపంచంబులున్
మోదంబొందగ గుక్షిలోకములు శంభో! సత్కృపాంభో నిధే.

౩౨

మ. జ్వాలల్ గ్రమ్మెడు క్ష్వేళవహ్ని గదియన్ సర్వామరుల్ జాల రీ
వేలీలం గని చేతఁబూనితివి స్వామీ! పక్వ జంబూఫలం
బా! లెస్సంగొన జిహ్వా సిద్ధ ఘుటికంబా! కంఠమందుంచఁగాఁ
బోలన్ నీలపు రత్నమా! తెలుపు శంభో! సత్కృపాంభో నిధే.

౩౩

శ్లో॥ నాలం వా సకృదేవ దేవ ! భవతస్సేవానతిర్వానుతిః
పూజావా స్మరణం కథా శ్రవణ మప్యాలోకనం మాదృశాం
స్వామి న్నస్థిరదేవతానుసరణాయాసేన న కిం లభ్యతే
కావా ముక్తిరితః కుతోభవతి చేత్కిం ప్రార్థనీయం తదా.

౩౪

శ్లో॥ కింబ్రూ మస్తవ సాహసం పశుపతే కస్యాస్తి శంభో ! భవ
ద్ధైర్యంచే దృశమాత్మనస్థితిరియం చాన్యైః కథం లభ్యతే
భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం నశ్యత్ప్రపంచం లయం
పశ్యన్నిర్భయ ఏక ఏవ విహరత్యానంద సాంద్రో భవాన్.

౩౫

శ్లో॥ యోగక్షేమ ధురంధరస్య సకల శ్రేయఃప్రదో ద్యోగినో
దృష్టా దృష్ట మతోపదేశకృతినో బాహ్యంతర వ్యాపినః
సర్వజ్ఞస్యదయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా
శంభో! త్వంపరమాంతరంగయితి మేచిత్తే స్మరామ్యన్వహం.

౩౬

శ్లో॥ భక్తో భక్తి గుణావృతే, ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః
కుంభేసాంబ! తవాంఘ్రి పల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలం
సత్వం మంత్రముదీరయన్ నిజశరీరాగార శుద్ధింవహన్
పుణ్యాహం ప్రకటీ కరోమి రుచిరం కల్యాణ మాపాదయన్.

౩౩

మ. నిను సేవించుటయో, నమస్సు లిడుటో నీ ప్రస్తుతిం జేయుటో
నినుఁ బూజించుటొ నీకథల్వినుటొ నిన్నే భక్తి ధ్యానించుటో
కనుటో ముక్తిని గూర్పఁజాలు నిదియే గాకన్య దైవేప్సితం
బున లేశంబును లేదుగా ఫలము ! శంభో ! సత్కృపాంభోనిధే.

౩౪

మ. అదిగా ! నీ కగు ధైర్యసాహసములున్ స్వాత్మస్థితిన్ నన్యులన్
బొదువంబోదు, లయంబునన్ సురగణంబుల్ స్థానముల్వీడి వి
న్నదనంబొప్ప ఋషుల్ భయంబుగన నీనశ్వత్ప్రపంచమ్మునన్
ముదితాత్ముండవు నీవె నిల్చితివి శంభో ! సత్కృపాంభో నిధే.

౩౫

మ. కరుణాశోభనతా ప్రదాయి. ఘనయోగ క్షేమవాహున్, లసత్
పరతత్త్వార్థక బోధనాగురుని సర్వవ్యాపి, సర్వజ్ఞునిన్;
వరదున్, నాకిలనంతరంగునిగ సద్భావంబున న్నిల్పి సం
స్ఫురణం జేసెద నన్వహంబు శివ ! శంభో ! సత్కృపాంభోనిధే.

౩౬

మ. నాదౌ దేహ గృహమ్ము శుద్ధికయి పుణ్యాహమ్ము భాషింతు స
మ్మోదంబన్సుధచేతఁ జిత్త కలశంబు న్నింపి సన్మంగళా
పాదన్ భక్తి గుణావృతంబుగ భవత్ పత్పల్లవుల్ చిత్ఫలం
బున్దోపన్దగు సత్త్వమంత్రమున శంభో ! సత్కృపాంభో నిధే.

౩౭

శ్లో॥ ఆమ్నాయాంబుధి మాదరేణ సుమనస్సంఘాస్సముద్యన్మనో
మంథానం దృఢభక్తి రజ్జుసహితం కృత్వామథిత్వాతతః
సోమం కల్పతరుం సుపర్వ సురభిం చింతామణిం ధీమతాం
నిత్యానంద సుధాం నిరంతర రమాసౌభాగ్య మాతన్వతే.

౩౮

శ్లో॥ ప్రాక్పుణ్యాచల మార్గ దర్శిత సుధామూర్తిః ప్రసన్నశ్శివ
సోమస్సద్గణ సేవితో మృగధరః పూర్ణ స్తమోమోచకః
చేతః పుష్కర లక్షితో భవతి చేదానంద పాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తి స్తదా జాయతే.

౩౯

శ్లో॥ ధర్మోమే చతురంఘ్రి కస్సుచరితః పాపం వినాశం గతం
కామ క్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతాః
జ్ఞానానంత్య మహౌషధి స్సుఫలితాకైవల్యనాథే సదా
మాన్యే మానస పుండరీక నగరే రాజావతంసే స్థితే.

౪౦

శ్లో॥ ధీ యంత్రేణ వచోఘటేన కవితాకుల్యోప కుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశి దివ్యామృతైః
హృత్కేదారయుతాశ్చ భక్తి కలమాస్సాఫల్య మాతన్వతే
దుర్భిక్షాన్మమ సేవకస్య భగవ న్విశ్వేశభీతిః కుతః.

౩౭

మ. నిగమాంభోధిని మందరంబుగ మదిన్ నిర్మించి సద్భక్తి ర
జ్జుగఁ ద్రచ్చన్ విబుధాళి, దానవెడలున్ సోమామృతంబున్ నమ
ర్త్యగవంబున్ ఘనకల్పకంబు వరచింతారత్నతేజంబు పెం
పుగ నానంద సురూపలక్ష్మియును శంభో! సత్కృపాంభోనిధే.

౩౮

శా. సోమున్ సద్గణసేవితున్ మృగధరున్ శోభాయమానున్ శివున్
తామిస్రాంతకుఁ బూర్ణ ప్రాక్సుకృతి గోత్రప్రస్థు మచ్చిత్తమన్
వ్యోమం బందున జూడ మోద సుమహాంభోరాశి యుప్పొంగు స
ద్యోమాన్యంబు మనః ప్రవృత్తమగు శంభో! సత్కృపాంభోనిధే!

౩౯

మ. సిరులంబొంచు మదీయ చిత్తనగరీ సింహాసనం బిందుశే
ఖరరాట్పాలితమేని ధర్మము చెలంగున్ నాల్గుపాదంబులన్
కరగుం బాపము కామషట్క మవియున్ కాలమ్ము సౌఖ్యమ్ము గున్
పొలచున్ జ్ఞాన మహౌషధీఫలము శంభో! సత్కృపాంభోనిధే!

౪౦

శా. నీ కల్యాణకథాంబు రాశి ధిషణా నిర్మాణ యంత్రంబునన్
వాకన్యాక్కెనతోఁ గవిత్వమను గాల్వం బారఁగాఁ జేయ మే
ధా కేదారమునందు భక్తి కలమం తా పండ దుర్భిక్షమే
పోకంబోవునొ! నీదు దాసునకు! శంభో! సత్కృపాంభోనిధే!

౪౧

శ్లో॥ పాపోత్పాత విమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుంజయ
స్తోత్రధ్యాన నతి ప్రదక్షిణ సపర్యాలోక నాకర్ణనే
జిహ్వాచిత్త శిరోంఘ్రి హస్తనయన శ్రోత్రై రహం ప్రార్థితో
మా మాజ్ఞాపయ తన్నిరూపయ ముహుర్మా మేవ మామేవచః.

౪౨

శ్లో॥ గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
స్తోమశ్చాప్త బలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితిః
విద్యావస్తు సమృద్ధి రిత్యఖిల సామగ్రీ సమేతే సదా
దుర్గాతి ప్రియదేవ! మామక మనో దుర్గే నివాసం కురు.

౪౩

శ్లో॥ మాగచ్ఛస్త్వ మితస్తతో గిరిశభో! మయ్యేవ వాసం కురు
స్వామిన్నాది కిరాత! మామక మనః కాంతార సీమాంతరే
వర్తంతే బహుశోమృగామదజుషో మాత్సర్య మోహాదయ
స్తాన్హత్వా మృగయా వినోదరుచితా లాభంచ సంప్రాప్స్యసి.

౪౪

శ్లో॥ కరలగ్న మృగః కరీంద్ర భంగో
ఘన శార్దూల విఖండ నోఽస్త జంతుః
గిరిశోవిశదాకృతిశ్చ చేతః
కుహరే పంచముఖోఽస్తి మేకుతో భీః.

౪౧

శా. ధ్యానస్తోత్ర నతిప్రదక్షిణ సపర్యాలోక నాకర్ణనల్
పూనం జిత్తము, జిహ్వాయున్, దల, పదంబుల్, సేతు లతుల్ సెవుల్
మేనం జోదనఁ జేయు నాజ్ఞనిడు వే మృత్యుంజయా! పాపముల్
బో నాటంకములేక సంతతము శంభో! సత్కృపాంభోనిధే!

౪౨

మ. ఘన గాంభీర్య మగడ్త ధైర్యమను ప్రాకారమ్ము నాప్తౌఘమై
తనరున్ సద్గుణపుంజ మింద్రియములౌ ద్వారంబులున్ జ్ఞాన వి
ద్యను సద్వస్తు సమృద్ధిగాఁ దలచి స్వాంతంబైన దుర్గంబు సొం
పున దుర్గేశ! వసింప వేఁడెదను శంభో! సత్కృపాంభోనిధే!

౪౩

మ. తిరుగంబోవకు మిందునందు మృగయాదిక్రీడ, నాయందె నీ
కిరవౌనాదికిరాత! చిత్త వనమం దిచ్చున్మదో న్మత్తతఁ
వరలున్ మోహమదాది జంతువులు పర్వందోలి వేఁటాడ నో
పు, రతిన్ దీవ్రశరంబులన్ బరగ. శంభో! సత్కృపాంభోనిధే!

౪౪

మ. భయమేలందు మదీయచిత్తకుహరిన్ భద్రమ్ముగా జంతు సం
చయ సంహారు గిరీశుఁ బంచముఖునిన్ శార్దూలభేదున్ సితా
వ్యయదేహున్ గజసంహరున్ మృగధరున్ భావింతు నత్యంత మొ
ప్పు యుగాంత ప్రకరున్ నినున్ దలతు శంభో! సత్కృపాంభోనిధే!

౪౫

శ్లో॥ ఛందశ్శాఖి శిఖాన్వి తైర్ద్విజవరైస్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేద భేదిని సుధాసారైః ఫలైర్దీపితే
చేతః పక్షి శిఖామణే త్యజ వృథా సంచార మన్యైరలం
నిత్యం శంకర పాదపద్మ యుగళీ నీడే విహారం కురు..

౪౬

శ్లో॥ ఆకీర్ణే నఖరాజికాంతి విభవైరుద్యత్సుధా వైభవై
రాదౌ తేపిచ పద్మరాగలలితే హంస వ్రజైరాశ్రితే
నిత్యం భక్తి వధూగణైశ్చరహసి స్వేచ్ఛా విహారం కురు
స్థిత్వా మానసరాజ హంస గిరిజానాథాంఘ్రి సౌధాంతరే.

౪౭

శ్లో॥ శంభుధ్యాన వసంత సంగిని హృదారామేఽఘ జీర్ణచ్ఛదా
స్స్రస్తా భక్తిలతాచ్ఛటా విలసితా పుణ్య ప్రవాళాశ్రితాః
దీప్యంతే గుణకోరకా జపవచః పుష్పాణి సద్వాసనాః
జ్ఞానానంద సుధామరంద లహరీ సంవిత్ఫలాభ్యున్నతిః..

౪౮

శ్లో॥ నిత్యానంద రసాలయం సురముని స్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్ద్విజ సేవితం కలుషహృత్సద్వాస నావిష్కృతం
శంభుధ్యాన సరోవరం వ్రజమనో హంసావతంస స్థిరం
కిం క్షుద్రాశ్రయ పల్వల భ్రమణ సంజాతశ్రమం ప్రాప్స్యసి.

౪౫

మ. అరయన్వేద కుజాగ్ర మంజు మధురంబై సద్విజ స్తోమమై
తిరమై ఖేదవిభేదమై సుఖదమై దివ్యామృతోత్పాదనా
కర సంఫల్య భవత్పదాబ్జ యుగ విఖ్యాతంపు నీడంబునన్
బురి నా చిత్తఖగమ్ము చేరునిఁక శంభో! సత్కృపాంభోనిధే!

౪౬

శా. శ్రీలొల్కన్ నఖరాజికాంతిచయ సంసిద్ధిన్ సుధా దీప్తి ధౌ
తాలేపంబునఁ బద్మరాగరుచిమై హంసాశ్రయానందమౌ
లీలన్ త్వత్పదసౌధమందు వసతిన్ బ్రీతిన్ మనోహంసమున్
బోలున్ భక్తి వధూసమేతముగ శంభో! సత్కృపాంభోనిధే!

౪౭

మ. హృదయారామమునందు భక్తిలత లెంతే జీర్ణపర్ణాఘముల్
విదళింపన్ సుకృతప్రవాళమును దీప్తిన్ గౌణపుం గోరకం
బుదయింపన్ జపవాక్సుమమ్ము లిడగా నుద్యత్సుకృద్వాసనల్
ముదితజ్ఞాన సుధామరంద లహరిన్ బొందా సుసంవిత్ఫలం
బొదవున్ నీ స్మృతియన్ వసంతమున శంభో! సత్కృపాంభోనిధే!

౪౮

మ. నిరతానంద రసాలయమ్ము సురమౌనిశ్రేణి చిత్తాంబుజా
కరమున్ సద్ద్విజ సేవ్యమున్ విమల నిష్కాలుష్య సద్వాసనన్
దిరమౌ ధ్యాన సరోవరమ్మునను మద్ధీహంసమొందంగఁ గాఁ
పురమల్పాశ్రయ భ్రాంతి నేల శ్రమ శంభో! సత్కృపాంభోనిధే!

౪౯

శ్లో॥ ఆనందామృత పూరితా హరపదాంభోజాలవాలోద్యతా
స్థైర్యోపఘ్న్యముపేత్య భక్తి లతికా శాఖోపశాఖాన్వితా
ఉచ్చైర్మానసకాయమానపటలీమాక్రమ్య నిష్కల్మషా
నిత్యాభీష్ట ఫలప్రదాభవతు మే సత్కర్మసంవర్ధితా.

౫౦

శ్లో॥ సంధ్యారంభ విజృంభితం, శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితం
ప్రేమశ్రీ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితం
భోగీంద్రాభరణం సమస్త సుమనః పూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరిమల్లికార్జున మహాలింగం శివా లింగితం.

౫౧

శ్లో॥ భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా
హ్లాదో, నాదయుతో, మహాసితవపుః, పంచేషుణా చాదృతః
సత్పక్ష స్సుమనోవనేషు, సపున, స్సాక్షాన్మదీయే మనో
రాజీవే, భ్రమరాధిపో ! విహరతాం శ్రీ శైలవాసీవిభుః.

౫౨

శ్లో॥ కారుణ్యామృతవర్షిణం, ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం
విద్యాసస్యఫలోదయాయ, సుమనస్సంసేవ్య మిచ్ఛాకృతిం
నృత్యద్భక్తమయూర, మద్రినిలయం, చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాంమే, మనశ్చాతకః.

౪౯

శా. పాదౌ నీ పదమందు భక్తిలత యొప్పన్ హర్షనీరంబులన్
మీఁదై ప్రాకగ నోర్పుకంబమున నెమ్మిం జిత్తమన్పందిటన్
భేదమ్మౌ బహుశాఖలన్ సుకృతులన్ బెంపొంది సుజ్ఞానమన్
మోదంపున్ ఫల మొందఁ జేయఁగదె! శంభో! సత్కృపాంభోనిధే!

౫౦

మ. తమి సంకామవిజృంభితున్ శ్రుతిశిరఃస్థానాంతరాధిష్ఠితున్
భ్రమరాభీష్టదు సద్గుణాఢ్యు సుమనోరమ్యున్ సుకృద్వాసనా
శ్రమునిన్ శ్రీగిరిమల్లికార్జును, శివాసంగాత్మ, భోగీంద్ర దా
ము, మహాలింగసురూపు, నిన్ గొలుతు శంభో! సత్కృపాంభోనిధే!

౫౧

శా. భృంగిచ్ఛానటునిన్ గరీంద్ర మదగ్రాహేప్సున్ స్ఫురన్మాధవా
సంగున్ సత్సుమనో వనాతినిరతున్, సత్పక్షు నాదాత్మ, నా
నంగప్రోద్భలు శ్రీగిరిభ్రమరికా నాథున్ మహాశ్వేతునిన్
పొంగౌ మద్ధృదయాంబుధిన్ దలతు శంభో! సత్కృపాంభోనిధే!

౫౨

మ. ఘనసంతాపపు గ్రీష్మమున్ గెడప నీ కారుణ్య ధారా సువృ
ష్టిని విజ్ఞాన సుసస్య ముత్ఫలితమై చేకూర సంవాస మ
ద్రిని చంచజ్జటలొప్ప భక్తజన బర్హిప్రీతి నృత్యంబునన్
జను సేవన్ సుమనోగణంబు గొను నిచ్ఛారూపు హృచ్చాతకం
బునకుం దోచెడు నీలకంధరత శంభో! సత్కృపాంభోనిధే!

౫౩

శ్లో॥ అకాశేనశిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతా
నుగ్రాహీ ప్రణవోపదేశ నినదైః కేకీతి యోగీయతే
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతంముదా
వేదాంతోపవనే విహార రసికం తం నీలకంఠం భజే.

౫౪

శ్లో॥ సంధ్యా ఘర్మ దినాత్యయో హరికరాఘాత ప్రభూతానక
ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చంచలా
భక్తానాం పరితోషబాష్ప వితతి ర్వృష్టిర్మయూరీ శివా!
యస్మిన్నుజ్జ్వల తాండవం విజయతే తం నీలకంఠం భజే.

౫౫

శ్లో॥ ఆద్యాయామిత తేజసే శ్రుతిపదై ర్వేద్యాయ సాధ్యాయతే
విద్యానందమయాత్మనే త్రిజగత స్సంరక్షణోద్యోగినే
ధ్యేయాయాఖిల యోగిభిస్సురగణై ర్గేయాయ మాయావినే
సమ్యక్తాండవ సంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే.

౫౬

శ్లో॥ నిత్యాయ, త్రిగుణాత్మనే, పురజితే, కాత్యాయనీశ్రేయసే
సత్యాయాది కుటుంబినే, మునిమనఃప్రత్యక్ష చిన్మూర్తయే
మాయాసృష్టజగత్త్రయాయ, సకలామ్నాయాంత సంచారిణే
సాయం తాండవ సంభ్రమాయ, జటినే సేయం నతిశ్శంభవే॥

౫౩

మ. నతభక్తప్రణవోపదేశరవ మాన్యత్ కేకి భోంగీంద్ర భూ
షిత, సంపాద్య కలాపి, వ్యోమజశిఖా శ్రీరమ్యునిన్ శైలజా
సుతను శ్యామఘనాప్త నృత్యకరునిన్ శ్రుత్యంతరారాము న
చ్యుతునిన్ గొల్చెద నీలకంఠు నిను శంభో! సత్కృపాంభోనిధే!

౫౪

మ. హరివాద్య ధ్వని గర్జితం బమర దృజ్న్యాసంబు సౌదామనీ
సరముల్, భక్తప్రమోదబాష్పతతి వర్షంబున్, దినాంతంబు తొ
ల్కరిగాగన్ గిరిజామయూరి గనుచున్ గల్యాణ సత్తాండవ
స్ఫురితున్ వేడెద నీలకంఠు నిను శంభో! సత్కృపాంభోనిధే!

౫౫

శా. ఆద్యానల్ప సుతేజసున్ శ్రుతిశిఖోద్యద్వేద్యమానున్ భవు
ఉద్యోగ త్రిజగత్ప్రమాదరణు స్వర్యోగీశ్వరధ్యేయుని
విద్యానందతమున్ జటిన్ నటనశోభిన్ భర్గు మాయావి, శ
ర్వు, ద్యోకేశుని నిన్ను గొల్చెదను శంభో! సత్కృపాంభోనిధే!

౫౬

శా. నిత్యుం బూర్ణ్రయనాశు నీశు మునిహృన్నీరేజ చిద్భానునిన్
సత్యు న్నాదిగృహస్థు నాగమ శిరస్సంచారు మాయాజగత్
స్థిత్యాసర్గ, వినాశకారణ నటున్ శ్రీకంఠుఁ ద్రైగుణ్యు నిన్
భూత్యావిష్కృతు సాంబు మ్రొక్కెదను శంభో! సత్కృపాంభోనిధే!

౫౭

శ్లో॥ నిత్యం స్వోదర పూరణాయ, సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాం నజానే విభో
మజ్జన్మాంతర పుణ్య పాకబల త స్త్వం శర్వ సర్వాంతర
స్తిష్ఠస్యేవ, హి తేనవా పశుపతే, తే రక్షణీయోస్మ్య హం.

౫౮

శ్లో॥ ఏకోవారిజ బాంధవః క్షితినభోవ్యాప్తం తమో మండలం
భిత్వా లోచన గోచరోపి భవతి త్వం కోటిసూర్య ప్రభః
వేద్యః కిం నభవస్యహో ఘనతరం కీదృగ్భవేన్మత్తమ
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే సాక్షాత్ప్రసన్నో భవ.

౫౯

శ్లో॥ హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోర స్తథా
చేతోవాంఛతి మామకం పశుపతే చిన్మార్గ మృగ్యం విభో
గౌరీనాథ ! భవత్పదాబ్జయుగళం కైవల్య సౌఖ్యప్రదం.

౬౦

శ్లో॥ రోధస్తోయహృత శ్రమేణ పథికశ్ఛాయాం తరో ర్వృష్టితో
భీతస్స్వస్థ గృహం గృహస్థ మతిథిర్దీనం ప్రభుం ధార్మికం
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతా వృత స్త్వం తథా
చేత స్సర్వ భయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరు
హమ్.

౫౭

మ. ధనము న్గోరి నరేంద్ర గేహముల నిత్యం బర్థినై పొట్టనిం
పను నేదిర్గుచు నిన్దలంపను మదిన్మత్పూర్వ పుణ్యమ్ము చేఁ
జన సర్వాంతరవర్తి వీవగుట నా స్వాతంబు నందుండి బ్రో
వు ననున్ గొల్చెద నీపదాబ్జములు శంభో! సత్కృపాంభోనిధే!

౫౮

శా. బానుం డొక్కఁడె భూనభోంతరములన్ వ్యాపించు పెన్జీఁకటిన్
దానై మ్రింగుచు నేత్ర గోచరుఁడగున్ దద్భానుకోటి ప్రభా
మానంబౌ భవదాననంబు గన నెందున్ సాంద్రతఁ గాఢమే
మో నా యంధతమమ్ము పాపగదె! శంభో! సత్కృపాంభోనిధే!

౫౯

మ. జలజాతమ్ముల హంస, నీల ఘన కాంతున్ జాతకం, బర్కును
స్రలకై కోకము, నబ్జకాంతినిఁ జకోరం బెప్డు వాంఛించు లీ
లలఁ గైవల్యసుఖమ్ము గూర్చు భవదంఘ్ర్యబ్జంబు చిన్మృగ్యముఁ
పులకల్దేర భజింపఁ గోరెదను శంభో! సత్కృపాంభోనిధే!

౬౦

మ. వరదంగూలఁ దటంబు వృష్టి దడియన్ వాసంబు మార్గశ్రమన్
దరుజ ఛ్ఛాయయులేమి ధార్మికుడు క్షుద్బాధార్తి గేస్తుండు, శై
త్యరుజన్ వహ్నియుఁ, జీఁకటిన్ వెలుఁగు నట్లన్ భద్రమౌ త్వత్పదాం
బురుహంబౌ సకలార్తిభంజకము శంభో! సత్కృపాంభోనిధే!

౬౧

శ్లో॥ అంకోలం నిజబీజ సంతతి, రయస్కాంతో ఫలం సూచికా,
సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం, సింధు స్సరిద్వల్లభం
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే !

౬౨

శ్లో॥ ఆనందాశ్రుభిరాతనోతి పులకం నైర్మల్యతశ్ఛాదనం
వాచా శఙ్ఖ ముఖస్థితై శ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః
రుద్రాక్షై ర్భసితేన దేవ వపుషో రక్షాం భవద్భావనా
పర్యఙ్కే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి.

౬౩

శ్లో॥ మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం పురిరిపో ర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంసశేషకబళం నవ్యోపహారాయతే
భక్తిః కిం నకరోత్యహో వనచరో భక్తావతంసాయతే.

౬౪

శ్లో॥ వక్షస్తాడనమంతకస్య కఠినాపస్మార సమ్మర్దనం
భూభృత్పర్యటనం నమత్సుర శిరః కోటీర సంఘర్షణం
కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే
మచ్చేతోమణిపాదుకావిహరణం శంభో ! సదాంగీకురు.

౬౧

మ. చనునంకోలము స్వీయబీజము, లయస్కాంతంబునన్ సూచి, సా
ధ్వి నిజేశున్, దృఢభక్తిచే— లతలు పృథ్వీజంబులన్, సింధువుల్
వనరాశిన్‌బలె, మద్ధృదాళియు భవత్పాదార విందద్వయం
బున లగ్నంబగు భక్తి నాకొనగు శంభో! సత్కృపాంభోనిధే!

౬౨

మ. ననుఁబాలింపఁగఁ దల్లి వోలె మహదానందాశ్రులం బుల్కలొ
ప్పను నైర్మల్యపటంబుగప్పి సువచఃప్రారంభ శంఖోద్ధపా
వన చారిత్రసుధాప్తి దృష్టి నిడి భవ్యైశ్వర్య రుద్రాక్ష ధా
రణరక్షన్ గలిగించి నీ భజనపర్యంకమ్మునన్ సంతత
మ్మును భక్తార్భకుఁ జేర్చి బ్రోవునను శంభో! సత్కృపాంభోనిధే!

౬౩

మ. మలగంద్రొక్కిన పాదరక్షలను భ్రూమధ్యంబునం దుంచి నం
బుల గండూషముజేసి నిం దడుపఁగా భుక్తావశిష్టంపు మాం
స లవం బర్పణసేయ మెచ్చి తట వీ సంచారిభక్తుండె! నో
ములు పూజ ల్సరిరావు భక్తికిల శంభో! సత్కృపాంభోనిధే!

౬౪

మ. కరకుంగొండల ద్రిమ్మరన్ యముని వక్షమ్మూది తన్నన్ భయం
కరమౌ నజ్ఞపిశాచి ద్రొక్కఁగ దివౌకశ్శీర్షకోటీర ర
త్నరుచుల్ రాయిడికోర్వ నీ మృదులపాదంబందు నాచిత్తమ
మురువౌ సన్మణి పాదుక న్గొనవె శంభో! సత్కృపాంభోనిధే!

౬౫

శ్లో॥ వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః
కోటీరోజ్జ్వల రత్నదీపకలికా నీరాజనం కుర్వతే
దృష్ట్వా ముక్తివధూ స్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే
యచ్చేత స్తవ పాదపద్మభజనం తస్యేహ కిం దుర్లభం.

౬౬

శ్లో॥ క్రీడార్థం సృజసిప్రపంచమఖిలం కీడామృగా స్తే జనాః
యత్కర్మాచరితంమయాచ భవతఃప్రీత్యైభవత్యేవతత్
శంభో స్వస్యకుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మాన్మామక రక్షణం పశుపతే కర్తవ్యమేవత్వయా.

౬౭

శ్లో॥ బహువిధపరితోష బాష్పపూర
స్ఫుట పులకాంకిత చారుభోగ భూమిమ్
చిరపదఫలకాంక్షి సేవ్యమానాం
పరమసదాశివభావనాం ప్రపద్యే.

౬౮

శ్లో॥ అమితముదమృతం ముహుర్దుహంతీం
విమల భవత్పదగోష్ఠ మావసంతీం
సదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేను మేకాం.

౬౫

మ. నిజవక్షస్థల తాడనస్మృతి విభీతిం బాఱు గాలుండు వే
నజరాళుల్ స్వశిరః కిరీటమణి దీవ్యంబైన నీరాజనః
భజియింపంగను ముక్తికాంతసలుపున్ బ్రశ్లేషముః నీ పదాం
బుజము న్గొల్వ నికేమి దుర్లభము శంభో! సత్కృపాంభోనిధే!

౬౬

శా. నీవేలీలసృజించి తీ జగములన్ నీ క్రీడకా జంతువుల్
కావా నీజనమెల్ల మచ్చరితమౌ కర్మల్ భవత్ప్రీతికా
సేవల్; నీదు కుతూహలంబునకు నై చేయింతు నాచేత, నః
బ్రోవన్ భారమునీది భూతపతి! శంభో! సత్కృపాంభోనిధే!

౬౭

మ. స్థిరమౌ సత్ఫలకాంక్ష నెద్దిమునులై సేవింతు రానందమా
గ్గరతిన్ దోచెడు నశ్రుపూరమున బుల్కల్ద్దేరు నైశ్వర్యమం
దిరమౌ నెద్దది నీ పద ద్వయము నర్థింజేరి ధ్యానింతు న
బ్బురమౌ నీదుప్రపత్తిగోరితిని శంభో! సత్కృపాంభోనిధే!

౬౮

మ. హితమై మత్కృతపూర్వపుణ్యఫలమై యిచ్ఛామృతాపాతముః
సతముఃజేపునదై లభించె నిదియే సద్భక్తియ న్గోవు నీ
పతితప్రాపక పాదగోష్ఠమున దాపఃజూడవే సత్కృపా
యుతమౌ నీదగు పాశుపత్యమున శంభో! సత్కృపాంభోనిధే!

౬౯

శ్లో॥ జడతా పశుతా కళంకితా
కుటిలచరత్వంచ నాస్తి మయి దేవ
అస్తియది రాజమౌళే
భవదాభరణస్య నాస్తి కిం పాత్రం

౭౦

శ్లో॥ అరహసిరహసి స్వతంత్రబుద్ధ్యా
వరివసితుం సులభః ప్రసన్నమూర్తిః
అగణితఫలదాయక ప్రభుర్మే
జగదధికో హృది రాజశేఖరోఽస్తి.

౭౧

శ్లో॥ ఆరూఢ భక్తి గుణ కుంచిత భావచాప
యుక్తైశ్శివస్మరణ బాణగణై రమోఘైః
నిర్జిత్య కిల్బిష రిపూన్విజయీ సుధీంద్ర
స్సానంద మావహతి సుస్థిర రాజ్య లక్ష్మీం.

౭౨

శ్లో॥ ధ్యానాంజనేన సమవేక్ష్య తమః ప్రదేశం
భిత్వా మహాబలిభిరీశ్వరనామ మంత్రైః
దివ్యాశ్రితం భుజగభూషణ ముద్వహంతి
యే పాదపద్మ మిహతే శివతే కృతార్థాః.

౬౯

మ. వరలన్వక్రతయున్ గళంకిత జడత్వమ్ముఀ బశుత్వమ్మునుఀ
గరమొప్పంగను దాల్చినట్టి శశి వేడ్కంగూర్చెనే రాజ శే
ఖర! నాయందునగల్గఁగా నవి యలంకారంబుగానోపవో!
పురసంహార! యనుగ్రహింపు నను శంభో! సత్కృపాంభోనిధే!

౭౦

మ. గణనాతీతములౌ ఫలంబులిడు లోకత్రాణ దక్షుఀ మహా
త్ముని సర్వేశుని రాజశేఖరకలాపుఀ నిఀ బ్రసన్నాత్ము నె
మ్మనమందుఀ సులభుండవౌట గొలుతుఀ బాహ్యంబు నందుఀ రహ
మ్మున, స్వాతంత్ర్యపు బుద్ధితో సతము శంభో! సత్కృపాంభోనిధే!

౭౧

శా. భావమ్మన్విలు, గాఢభక్తి గుణమై వర్తిల్ల నీ మంత్రముఀ
జేవల్ దేరు నమోఘ బాణములు వే జీల్పంగఁ బాపారులఀ
దేవా! సుస్థిర రాజ్యలక్ష్మి ప్రబలుఀ దీవ్య జ్జయానందమై
బ్రోవం జాలు సుధీంద్రు భక్తిపరు, శంభో! సత్కృపాంభోనిధే!

౭౨

మ. తగ నీధ్యాన మహాంజనమ్మున దమోద్వారంబు నీక్షించి త్వ
న్నిగ మామ్నాయ సుమంత్ర కార్షముల దద్భేదంబు గావించి స్వ
ర్జగదారాధ్యము నాగభూషిత వసు స్థానంబునౌ నీపదం
బు, గనఀ జెందెడు సార్థతఀ జనుఁడు శంభో! సత్కృపాంభోనిధే!

౨౩

శ్లో॥ భూదారతా ముదవహద్య దపేక్షయా శ్రీ
భూదార ఏవ కిమతస్సుమతే లభస్వ
కేదార మాకలిత ముక్తి మహౌషధీనాం
పాదారవింద భజనం పరమేశ్వరస్య.

౨౪

శ్లో॥ ఆశాపాశ క్లేశ దుర్వాసనాది
భేదోద్యుక్తై ర్దివ్య గంధై రమందైః
ఆశాశాటీకస్య పాదారవిందం
చేతఃపేటీం వాసితాం మే తనోతు.

౨౫

శ్లో॥ కల్యాణినం సరస చిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యం
చేతస్తురంగ మధిరుహ్యా చర స్మరారే
నేత స్సమస్తజగతాం వృషభాధిరూఢ.

౨౬

శ్లో॥ భక్తిర్మహేశ పదపుష్కర మావసంతీ
కాదంబినీవ కురుతే పరితోష వర్షం
సంపూరితో భవతి యస్య మన స్తటాక
స్తజ్జన్మ సస్య మఖిలం సఫలంచ నాన్యత్.

౨౩

శా. భూదారంబ యెదేని గోరి యల శ్రీ భూదారుఁడౌ శౌరి సత్
కేదారంబు మహౌషధుల్పైనుప ముక్తిం గూర్పఁగా నెద్ది నీ
పాదాంభోరుహ సేవనంబె గద! సద్భక్తిం బ్రసాదించి స
న్మోదారంభుని గాగ బ్రోవు నను శంభో! సత్కృపాంభోనిధే!

౨౪

శా. ఆశా పాశ యుతంపు క్లేశములచే నత్యంత దుర్వాసనా
కోశమ్మైన మనః కరండమును దార్కొ దివ్యగంధంబుచే
నాశా శాటి ధర! త్వదీయ మృదుపాదాబ్జమ్ము మద్వాసనల్
పో, శాపంబిడినట్లు బాపు గద! శంభో! సత్కృపాంభోనిధే!

౨౫

మ. సరసంబౌ నవచిత్రవర్తనములన్ సర్వేంగితజ్ఞత్వమున్
వరకల్యాణ ధృవాది లక్షణములన్ బాటించి మచ్చిత్త మన్
తురగం బెక్కి చరింపు సర్వజగముల్ తుల్యంబు నీ నందియున్
బొరయం జాల దకల్మషాకరము శంభో! సత్కృపాంభోనిధే!

౨౬

మ. తవపాదాంబుజ పుష్కరమ్ము నను సద్భక్త్యుద్ధకాదంబినీ
నివహంబుల్ పరితోష వృష్టి నెనయన్ జిత్తంపుఁ గాసార మిం
పవియ న్నిండెడు నెందు నట్టి సుకృతంబౌ జన్మ సస్యంబులున్
భువి సాఫల్యముగావొ! సాంబశివ! శంభో! సత్కృపాంభోనిధే!

౭౭

శ్లో॥ బుద్ధిస్థిరాభవితు మీశ్వరపాదపద్మ
సక్తావధూర్విరహిణీవ సదాస్మరంతీ
సద్భావనా స్మరణ దర్శన కీర్తనాది
సమ్మోహితైవ శివమంత్ర జపేన వింతే.

౭౮

శ్లో॥ సదుపచార విధిష్వనుబోధితాం
సవినయాం సహృదం సముపాశ్రితాం
మమ సముద్ధర బుద్ధిమిమాం ప్రభో
వరగుణేన నవోఢ వధూమివ.

౭౯

శ్లో॥ నిత్యం యోగిమనస్సరోజదళ సంచార క్షమ స్త్వత్క్రమ
శ్శంభో ! తేన కథం కఠోరయమరా డ్వక్షః కవాట క్షతిః
అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం హా మే మనశ్చింతయ
త్యే తల్లోచన గోచరం కురు విభో హస్తేన సంవాహయే.

౮౦

శ్లో॥ ఏష్యత్యేష జనిం మనోఽస్య కఠినం తస్మిన్నటానీతి మ
ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః
నోచే ద్దివ్యగృహాంతరేషు సుమన స్తల్పేషు వేద్యాదిషు
ప్రాయస్సత్సు శిలాతలేషు నటనం శంభో ! కిమర్థం తవ.

౨౭

మ. కమనీయంబగు నీపదాంబురుహముల్ కాంక్షించి నాబుద్ధి ని
ష్క్రమమౌ ధ్యానమునన్ జపంబునను నిచ్చన్ బాడఁగాఁ జూడఁగాఁ
దమి నాథుంగనఁ బ్రేయసింబలె నితాంతామోహితంబయ్యె, నో
పు, మనంబిచ్చి, రమింపఁగా దయను శంభో! సత్కృపాంభోనిధే!

౨౮

మ. సదయాంతఃకరణమ్ముతో నిరతమున్ సన్మానితంజేసి స
ద్ధృదయన్ సద్వినయన్ సుపూజన విధావృత్తిన్ సదా దీక్షితన్
ముదమొప్పంగ నవోఢవోలె గను నాబుద్ధిన్ భవద్భావనా
ముదితం జేసి సముద్ధరింపు మిఁక శంభో! సత్కృపాంభోనిదే!

౨౯

మ. వరమౌనీంద్ర మనోంబుజాత దళసంవర్తి క్రమం బొప్పు నీ
చరణ ద్వంద్వ మదెట్టులోర్చె యమ వక్షస్తాడనన్సల్పఁగా
పరమేశా! మృదులమ్ములౌనుగద నీపాదంబులన్నాకు జూ
పు రయంబొప్ప వహింతు హస్తముల శంభో! సత్కృపాంభోనిధే!

౩౦

మ. ధరణిం బుట్టగలందు వీని మనమత్యంతమ్ము గాఠిన్యమేఁ
దిరుగంగావలె నందునంచు గిరిఁ బెంద్రుష్టిం బ్రచారంబు సు
స్థిరతాభ్యాసముఁ జేయ సాగితివి యెంతే నట్లు గాకున్నచోఁ
బురముల్ శయ్యలు వేదులున్ గొరవ! శంభో! సత్కృపాంభోనిధే!

౮౧

శ్లో॥ కంచిత్కాలముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచిద్ధ్యాన సమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాఽకర్ణనైః
కంచిత్కంచిదవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశామీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పిత మనా జీవన్ సముక్తఃఖలు.

౮౨

శ్లో॥ బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాది రూపం దధౌ
త్వత్పాదే నయనార్పణంచ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్యతరస్సఏవహి నచే త్కోవా తదన్యోధికః.

౮౩

శ్లో॥ జనన మృతి యుతానాం సేవయా దేవతానాం
నభవతి సుఖ లేశ స్సంశయో నాస్తి తత్ర
అజని మమృత రూపం సాంబ మీశం భజంతే
య ఇహ పరమ సౌఖ్యం తేహి ధన్యా లభంతే !

౮౪

శ్లో॥ శివ పరిచర్యా సన్నిధా నాయ గౌర్యా
భవ మమ గుణధుర్యాం బుద్ధి కన్యాం ప్రదాస్యే
సకల భువనబంధో సచ్చిదానంద సింధో
సదయ హృదయ గేహే సర్వదాసంవసత్వం.

౮౧

మ. మన మానందముఁ జెంద నిన్ను భజియింపం గొంత, నీపాదచిం
తనచేఁ గొంత, స్మరింపఁ గొంత, నతిచేతం గొంత, నీ సత్కథల్
వినఁగాఁ గొంత, నుతింపఁ గొంత, కనుదీప్తిం గొంత నీదైనప్రా
పున దేహంబున ముక్తుఁడౌ నరుఁడు శంభో! సత్కృపాంభోనిధే!

౮౨

శా. బాణంబై పశువయ్యు నర్థతనుతన్ భార్యాత్వమై ఘోణియై
తానే నెచ్చెలియై మృదంగ వహియై త్వద్దేహ భాగుండు, దా
నానా రీతుల మారి నీదుపద చింతన్ గోరి నేత్రార్పణం
బూనన్ బూజ్యతరుండు గాఁడో హరి! శంభో! సత్కృపాంభోనిధే!

౮౩

మ. త్రిదశుల్ జన్మ మృతుల్ దొరంగు సుఖ మేంతే గాని తత్సేవచే
నొదవం బోదది నిశ్చయంబు, నజు, భవ్యన్ మృత్యు నాశున్ నినున్
పదముల్బట్టి యిహంబున న్గొలుచు నాభవ్యుండె గాంచున్ బరం
బుదయాదిక్రమ మెల్ల వేఁదొలగు శంభో! సత్కృపాంభోనిధే!

౮౪

శా. నీకుం గౌరికి సేవజేయఁగను సాన్నిధ్యమ్ము నందుండ నా
ధీకన్యన్, గుణధుర్య, దాసిగొని రక్తిం జిత్తగేహమ్ము నం
దో కారుణ్యసుధీ! జగత్త్రితయ బంధూ! సచ్చిదానంద సిం
ధూ! కైవల్యనిధీ! వసింపఁగదె శంభో! సత్కృపాంభోనిధే!

౭౫

శ్లో॥ జలధి మథనదక్షో నైవ పాతాళ భేదీ
నచ వనమృగయాయాం నైవ లుబ్ధ ప్రవీణః
అశనకుసుమభూషా వస్త్రముఖ్యాం సపర్యాం
కథయ కథమహంతే కల్పయా మీందు మౌళే.

౭౬

శ్లో॥ పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే
పక్షిత్వం నచవా కిటిత్వమపి తు ప్రాప్తం మయా దుర్లభం
జానే మస్తక మంఘ్రి పల్లవ ముమాజానే నతేఽహం విభో
నజ్ఞాతం హి పితామహేన హరిణ తత్త్వేన తద్రూపిణా.

౭౭

శ్లో॥ అశనంగరళం ఫణీ కలాపో
వసనం చర్మచ వాహనం మహోక్షః
మమదాస్యసికిం కిమస్తి శంభో
తవ పాదాంబుజ భక్తిమేవ దేహి.

౭౮

శ్లో॥ యథా కృతాంభోనిధి సేతుబంధనః
కరస్థలాధః కృత పర్వతాధిపః
భవాని తే లంఘిత పద్మసంభవ
స్తదాశివార్చా స్తవభావన క్షమః.

౧౫

మ. జలధింజేరి మథింపలేను ఫణివాసమ్మెగఁగా లేను, గా
నల వేఁటాడఁగ బోయఁగాను, శితికంఠా! భోజనంబున్సుమ
మ్ములు భూషావళి, యంబరమ్ము, విధి సంపూజ న్సమర్పింప నీ
వులదేనన్ భజియింపఁ గల్గుదును! శంభో! సత్కృపాంభోనిధే!

౧౬

మ. నినుఁ బూజింపఁ బదార్థసంగ్రహణమున్ నే జేసితిం గాని బూ
జను జేయం గనుబెట్టు లబ్జజుఁడు హంసంబయ్యు ఘోణంబు రూ
పున విష్ణుండును మార్గణంబునను నీమూర్ధంబుఁ బాదద్వయం
బును గానం గనులేదుగా! గిరిశ! శంభో! సత్కృపాంభోనిధే!

౧౭

మ. వరదా నా కిలనే మొసంగె దశనంబా! కాలకూటమ్మె యం
బరమా! ఏనికతోలు; భూషణములా! వ్యాళంబునౌ, నెంచఁగా
తురగంబా! సుమహోక్షమేకద మహత్త్మోషంబునౌ నీ పదాం
బురుహంబందున భక్తి నాకొసగు శంభో! సత్కృపాంభోనిధే!

౧౮

శా. చెన్నొ నబ్ధికి సేతుబంధనము నేజేయంగ నౌనేని య
త్యౌన్నత్యంబగు వింధ్యపర్వతమునే హస్తంబుసేతన్ నడం
ప నౌనేని పితామహున్నతిశయింపన్ నోపినన్ జేతు నా
పున్నెం బొప్ప భవత్పదార్చనము శంభో! సత్కృపాంభోనిధే!

౮౯

శ్లో॥ నతిభిర్నుతి స్త్వమీశ పూజా
విధిభిర్ధ్యాన సమాధిభి ర్నతుష్టః
ధనుషా ముసలేనచాశ్మభి ర్వా
వదతే ప్రీతికరం తథా కరోమి.

౯౦

శ్లో॥ వచసా చరితంవదామి శంభో
రహముద్యోగ విధాసు తే ప్రసక్తః
మనసాకృతిమీశ్వరస్య సేవే
శిరసాచైవ సదాశివం నమామి.

౯౧

శ్లో. ఆద్యావిద్యా హృద్గతా నిర్గతాసీ
ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్
సేవే నిత్యం శ్రీకరం త్వ త్పదాబ్జం
భావే ముక్తేర్భాజనం రాజమౌళే.

౯౨

శ్లో. దూరీకృతాని దురితాని దురక్షరాణి
దౌర్భాగ్యదుఃఖ దురహంకృతి దుర్వచాంసి
సారం త్వదీయ చరితం నితరాం పిబంతం
గౌరీశ ! మామిహ సముద్ధర సత్కటాక్షైః.

౮౯

మ. నతిచేత న్నుతిచేత నర్చనవిధిఁ ధ్యానాదిచేఁ దృప్తికా
వ తికాఠిన్య శిలీముఖాగ్ర ముసలాశ్మాది ప్రహారంబు స
మ్మతి కల్పించెనొ నీకు ప్రీతి కరమౌమార్గంబుచేఁ దృప్తిఁ ద
న్మృత, నీచిత్తముఁ దెల్పు సాంబశివ ! శంభో ! సత్కృపాంభోనిధే !.

౯౦

మ. మనమందెప్పుడు నీస్వరూపమును సంభావించి సేవింతు వా
క్కున నీ సత్కథఁ బాడెదన్ శిరము నక్కున్ వంచి నిన్మ్రొక్కెదన్
గన నుద్యోగ విధాన ధీ పటిమలన్గా నే సమర్థుండ నే
ర్పున నన్నేలు కొనంగఁ గోరెదను శంభో ! సత్కృపాంభోనిధే !

౯౧

మ. తొలుత న్నామదిలోని యజ్ఞతను వేఁదోయంగ నీ సత్కృపా
కలనన్ హృద్యపు విద్య పట్టువడఁగాఁగాలున్ మహోహర్షమున్
విలసచ్ఛ్రీకర ముక్తిదప్రథిత దివ్యంబైన నీపాద మిం
పొలయం దాల్తు మనంబునం దెపుడు శంభో ! సత్కృపాంభోనిధే !.

౯౨

మ. దొరలు న్నా దురహంకృతుల్ దురితముల్ దుర్వ్యాకులు న్నా దుర
క్షర దౌర్భాగ్యపు దుఃఖముల్ పరగ నీ చారిత్ర పీయూషమున్
నిరతిం ద్రావుదు తావకీన కరుణన్ నీమంబుతోఁ గాలమున్
బొరలింతు న్నిహమందె మోక్షమిదు శంభో ! సత్కృపాంభోనిధే !.

౯౩

శ్లో॥ సోమకళాధర మౌళౌ
కోమలఘన కంధరే మహామహసి
స్వామిని గిరిజానాథే
మామక హృదయం నిరంతరం రమతామ్.

౯४

శ్లో. సారసనా తే నయనే తావేవకరౌ
స ఏవ కృత కృత్యః
యాయే యౌయో భర్గం వద
తీక్ష్ణా తే సదార్చతః స్మరతి.

౯౫

శ్లో. అతిమృదుళౌ మమచరణా
వతికఠినం తే మనోభవానీశ
ఇతి విచికిత్సాం సంత్యజ
శివ కథమాసీద్గిరౌ తథా ప్రవేశః.

౯౬

శ్లో. ధైర్యాంకుశేన నిభృతం ర
భసా దాకృష్య భక్తి శృంఖలయా
పురహర చరణాలానే
హృదయ మదేభం బధానచిద్యంత్రైః.

౯౩

మ. శిరమందుం శశిరేఖకాంతి యొసగం శ్రీకంధరం బభ్రనీ
లరుచుల్ నీనఁగఁ బార్వతీసతి గుణాలంకార వామాంగియై
వరలంగాఁ గడుఁ దేజరిల్లెడు గణస్వామిం నినుం జిత్తమొ
ప్పారతిం ధ్యానము సేతు నెల్లపుడు శంభో! సత్కృపాంభోనిధే!

౯౪

మ. అదియేనాల్క యదేను కన్గవ; యదేనౌ హస్తముం; నాతఁడే
కద ధన్యుం డెది నిన్నుఁబల్కుఁ గను సక్తంబైనఁ జిత్తంబుతో
నెది పూజించు స్మరించు నెవ్వఁడు నినుం నీశా! కృతార్థుండు స
న్ముదితుం డాతఁడు ముక్తిభాజుఁడగు శంభో! సత్కృపాంభోనిధే!

౯౫

మ. అతికాఠిన్యము నామనంబు మృదులంబై యొప్పు నీపాదముల్
జత సుంతేర్పడ దంచుఁ దల్చెదవొ! యీ సాకెట్లు సందేహపనౌ
నతి కార్కశ్యపుఁ గొండయందునఁ గదా నట్టాడుట లీవు న
ద్భుత మీమాట! వసింపు నామదిని, శంభో! సత్కృపాంభోనిధే!

౯౬

శా. దేవా! నాదగు చిత్త మత్త కరి సాధింపంగ ధైర్యాంకుశం
బీవేతాలిచి మత్తుచో నొడిచి యెంతే జ్ఞాన యంత్రంబునం
దావౌ నీచరణాన భక్తియను త్రాటం గట్టి యత్యంతముం
బ్రోవం జూడవె యాదరంబుననను శంభో! సత్కృపాంభోనిధే!

౯౭

శ్లో॥ ప్రచరత్యభితః ప్రగల్భ వృత్త్యా
మదవా నేష మనః కరీ గరీయాన్
పరిగృహ్యానయేన భక్తిరజ్జ్వా
పరమస్థాణుపదం దృఢన్నయాముమ్.

౯౮

శ్లో॥ ఇదం తే యుక్తం వా పరమశివ కారుణ్యాజలధే
గతౌ తిర్యగ్రూపం తవపద శిరోదర్శన ధియా
హరిబ్రహ్మాణౌ తౌ దివి భువిచరంతౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామిన్కథయ మమవేద్యోఽసి పురతః.

౯౯

శ్లో॥ స్తోత్రేణాల మహం ప్రవచ్మి నమృషా దేవా విరించ్యాదయ
స్తుత్యానాం గణనాప్రసంగసమయే త్వా మగ్రగణ్యం విదుః
మాహాత్మ్యాగ్ర విచారణప్రకరణే ధానాతుషస్తోమన
ద్ధూతస్త్వా విదురుత్తమోత్తమ ఫలం శంభో భవత్సేవకాః.

౧౦౦

శ్లో॥ సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిస్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యామ్
ఉద్యద్భూషావిశేషా ముపగత వినయాం ద్యోతమానార్థ రేఖాం
కల్యాణీం దేవగౌరీప్రియ ! మమకవితా కన్యకాం త్వం గృహాణ.

౯౭

శా. ఇచ్చం బోవుచు నుండు నెల్లెడల నాయీ చిత్త మత్త ద్విపం
బెచ్చో నిల్వ కలంతి వేగమునఁ దండ్రీ! దీనిఁ జేఁబట్టి నీ
సచ్చారిత్రపు భక్తి శృంఖలముచే సందించి బంధింపవే
పుచ్చఁగ రాని పదంబునన్ దివిరి శంభో! సత్కృపాంభోనిధే!

౯౮

మ. అనుమానింపక విష్ణుఁడు న్విధియు దివ్యాగ్రూపము ల్దాల్చి మే
దిని నాకాశమునందు జొచ్చి యును సుంతే గానలేనట్టి పా
వనమౌ నీదగు నానుపూర్వికము లల్పజ్ఞుండు దా గాంచ నో
పునె! నీ సత్కృప లేక మర్త్యుఁ డిల శంభో! సత్కృపాంభోనిదే!

౯౯

శా. చాల న్నీపద భక్తి సంస్తుతుల నే సత్యంబు భాషింతు వే
యేలా! స్తుత్యుల నగ్రగణ్యుఁడవు నీవే యంచు మాహాత్మ్యమం
దోలి న్నుత్తమ సత్ఫలం బనిరి దివ్యౌక స్ప్రముఖ్యుల్ నిన్
వోలన్ ధానపుఁబొల్లుగా విఫలమైపో నన్యదేవాళియున్
భూ లక్ష్మీశ ముఖార్చితాబ్జపద శంభో!! సత్కృపాంభోనిదే!!

౧౦౦

మ. సకలాలంకృత, సాధువృత్త, సుమనస్సంస్తూయ, సాద్గుణ్య స
ర్వకలా లక్షణ లక్షితాతి వినయార్థ వ్యక్త సద్భావనా
ధికయున్ సత్పదయున్ సువర్ణయుత నర్థిం గావ్యపుం గన్యఁ బ్రో
వు కరంబిష్టముతోడఁ జేతఁగొని శంభో! సత్కృపాంభో నిదే!

౧౦౧

మ. భగవత్పాదులు శంకరుల్ ప్రథిత సర్వజ్ఞుల్ సదాభవ్యు లా
జగదారాధ్యుల సత్కృతిన్ దెనుఁగు బాసం జెప్పితిన్ త్వద్దయా
నుగతింగోరి రచించి త్వత్పదములందు న్భక్తి నర్పించు సొ
మ్ముగ నే నెంచితి నాదుభాగ్యమున శంభో! సత్కృపాంభోనిధే!

౧౦౨

శా. మక్కిం మక్కిగఁ దెల్గు పల్కులకునై మార్పంగ యత్నింప లే
దిక్కంజాత భవాండభవ్య కవులం దే స్థానముం గోరి స
మ్యక్కీర్తిం గడియింప నిచ్చయును లే దావంతయున్ దల్తు నా
మ్రొక్కు ల్పాపహరంబు లౌ ననుచు శంభో! సత్కృపాంభోనిధే!

౧౦౩

మ. నను నాత్రేయసగోత్రు నంచిత ముకుందఖ్యాత వంశోద్భవున్
ఘన శేషాచల పుత్త్రి పౌత్రుని ద్విజానందాత్మ శ్రీరామచం
ద్రుని పౌత్రున్ వర సుబ్బనాబిద సుపుత్రున్ రామమూర్త్యాభిధే
యుని బ్రోవంగను నీదె భార మిఁక శంభో! సత్కృపాంభోనిధే!

# శివానందలహరి - శుద్ధ పత్రము

| వ. సంఖ్య | శ్లో /ప. సంఖ్య. | పాదం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 1 ప. | 1 పా. | అవతంశుల్ | అవతంసుత |
| 2 | 2 ప. | 2 పా. | దీ | ధీ |
| 3 | 3 ప. | 2 పా. | జిదానందు | జిదాలంబు |
| 4 | 4 ప. | 3 పా. | రాట్మాయి | రాట్మాయి |
| 4 | 9 శ్లో. | 3 పా. | సమర్తైవ్యకం | సమరైవ్యకం |
| 5 | 10 శ్లో. | 4 పా. | చేర్ద్రృదయ | చేద్ధృదయ |
| 6 | 14 ప. | 1 పా. | నివారణాకిరత | నివారణాతిరత |
| 7 | 14 ప. | 4 పా. | తత్త్వోపేతమ్మగు | తత్త్వోపేతమ్మగు |
| 8 | 16 శ్లో. | 1 పా. | ద్రిర్ఘాయుర్భభతు | ర్దీర్ఘాయుర్భవతు |
| 9 | 16 శ్లో. | 4 పా. | శివ | శిర |
| 10 | 18 శ్లో. | 2 పా. | హరిముఖా, | హరిముఖాః |
| 11 | 18 ప. | 1 పా. | జగములం | జగములఞ |
| 12 | 19 శ్లో. | 1 పా. | ఘటికే | ఘటకే |
| 13 | 20 శ్లో. | 2 పా. | సైర | సైర్వర |
| 14 | 20 ప. | 2 పా. | భక్తిసూత్రంబందు | భక్తిదృఢసూత్రంబందు |
| 15 | 20 ప. | 4 పా. | దుర్వ్యాహమ్ముల్ | దుర్వ్యాహాహమ్ముల్ |
| 16 | 24 ప. | 3-4 పా. | యుగంబుల నొప్పం దృటివోలె నెట్టుదునో | స్వయంబుల కల్పంబుల నెట్టుదున్ దృటిక |
| 17 | 25 ప. | 2 పా. | స్కంధంబుపై | వాహంబుపై |
| 18 | 26 ప. | 2 పా. | తద్దివ్యాజ్య | తద్దివ్యాబ్జ |
| 19 | 27 | 2 పా. | దివస్తరు | వియత్తరు |
| 20 | 28 | 4 పా. | న్నినునేమ్మదిన్నిలుప | సకలాత్మునిం దలఁప |

| వ. సంఖ్య. | శ్లో./ప. సంఖ్య. | పాదం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 21 | 29 శ్లో. | 3 పా. | దిశచాతుషిం | దిశచాతుషీం |
| 22 | 30 శ్లో. | 4 పా. | త్రిలోకే | తిలోకే |
| 47 | 95 ప. | 3 పా. | గాండ | గోండ |
| 48 | 96 శ్లో. | 3 పా. | చణా | చరణా |
| 49 | 99 ప. | 3 | నిన్ద్యోలోకము ఖ్యామరుల్ | దివ్యోకస్సుముఖ్యుల్ నినుణ్ |
| 50 | 99 | 4 పా. | ధాన్యపు | ధానపు |

ది ఓరియన్టల్ పవర్ ప్రెస్, తెనాలి.